# యక్షిణీ తంత్రము

## అనుభవ తాంత్రిక సాధనారహస్యాలు



- బ్రహ్మశ్రీ యమ్. సత్యనారాయణ సిద్ధాన్తి

మోహన్ పబ్లికేషన్స్, రాజమహేంద్రవరము

# యక్షిణీ తంత్రము

## అనుభవ, తాంత్రిక సాధనారహస్యములు


శతాధిక గ్రంథకర్త :

**జ్యోతిషాగమ వాస్తు పండిట్**

**M. సత్యనారాయణ సిద్ధాన్తి**

**తెనాలి - 1.**





ప్రకాశకులు : ☎ 246 2565

# మోహన్ పబ్లికేషన్స్

**అజంతా హోటల్ ఎదురుగా,**

**కోటగుమ్మం, రాజమహేంద్రవరము -1**

# యక్షిణీ తంత్రము

**- M. సత్యనారాయణ సిద్ధాన్తి**
శ్రీ విద్యా జ్యోతిష కేంద్రం,
1-35-39, మల్లాదివారి వీధి, నాజరుపేట, **తెనాలి - 1.**

**Re Print**



ప్రకాశకులు :
**మోహన్ పబ్లికేషన్స్**
అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, **రాజమహేంద్రవరము**
☎ ***(0883) 246 2565***

# విషయసూచిక

# యక్షిణీ తంత్రము

శ్లో॥ లంబోదరం పరమ సుందర మేకదంతం
రక్తాంత దీర్ఘనయనం పరమం పవిత్రమ్
ఉద్యద్దివాకర కళోజ్జ్వల కాంతి కాంతం
విఘ్నేశ్వరం సకలవిఘ్నహరం నమామి ॥

శ్లో॥ జ్ఞానాన దమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుగ్గురు ర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మతస్మై శ్రీగురవేనమః

మూడు లోకాలు పాలించేతల్లి పార్వతి, పరమేశ్వరుని అర్ధశరీరాన్నా క్రమించి దివ్య శక్తిగా పేరుగాంచిన ఈ జనని ఆయా కాలములందనేక నామరూపాది విశేషములు గల్గి భక్తులను కాపాడి

ధర్మరక్షణ మొనర్చియున్నది. ఈజగదంబనే మనము దాక్షాయణి, గిరికన్య, ఉమ, కాత్యాయని, గౌరి, అపర్ణ, హైమవతి, శివా, భవానీ, చండిక, అంబిక, మృడాని, దుర్గ, కాళీ, లక్ష్మీ, సరస్వతీ, ఆర్యా, సర్వమంగళా, బగళా, భైరవి, శాకంభరి, శాంభవి, మొదలగు నామములతో పూజించి కోరిక లీడేర్చు కొనుచున్నాము. ఇది యుగ యుగాలుగా కొనసాగుచున్న శక్తిపూజ. మానవుడొకానొక కార్యమునందు ద్విగుణీకృతశక్తిని సంపాదించుటకు దేవుని మించిన దైవము గానరాదు. – తన్ను నమ్మిన భక్తులకు భుక్తిని (కామ్యములను) ముక్తిని (మోక్షమును) ప్రసాదింప గల సమర్థురాలా పర దేవత యొక్కతియే!

"అమ్మా" అని ఆక్రోశించిన వారిని ఆపదలలో వారిని ఆపదలలో ఆదుకోవటానికి దీక్షా కంకణము ధరించిందా జగజ్జనని వేదాలలో ఘోషించేది. రాగాలలో నివసించేది, నాట్యాలలో నర్తించేది, హృదయాలలో స్పందించేది, మంత్రాలలో పలికేది, ఈ దివ్యశక్తి యొక్క ప్రాభవ వైభవవర్ణనలే! మంత్ర, తంత్ర యంత్ర, ఇంద్రజాల, సమ్మోహన, విద్యలు, అమ్మ ఆజ్ఞకులోబడినవే! అందుకే ఆమె **"శ్రీ విద్య"**గా విఖ్యాతి నందినది.

మూడుకోట్ల దేవతలేగాక సిద్ధ, గంధర్వ, నాగ, యక్ష, రాక్షసాదులు గూడా ఆ రాజరాజేశ్వరీ పదకమలములు భజించి తరించి, ఆమె ఆజ్ఞానుబద్ధులైయున్నారు. అమృత సముద్ర మధ్యంలో గల మణిద్వీపంపై మారేడువనంలో గల కల్పద్రుమ పీఠంపై సింహాసనాసీనయైయుండే పరమేశ్వరిని, రాగద్వేష, మోహరహితులై, శరణువేడి పూజింపనిదే

కోరికలు నెరవేరుట దుర్లభము, అభీష్టసిద్ధికి – అంబికా చరణ సేవకన్నా వేరుగత్యంతరములేదు. **"కామసేవిత"**గా పేరు గాంచిన దివ్య స్వరూపిణి, చండికను ఆశ్రయించని వారికి ఎందునా జయములేదు. తన భక్తులను శత్రువులు బాధించు నప్పుడు ఆదేవి మహోగ్రకాళికా రూపంతో శత్రుసంహారం జరుపుతుంది. అజ్ఞానియైన తనపుత్రుడు (భక్తుడు) మూఢత్వంతో విలపిస్తుంటే **"బగళా"** రూపంలో ఆతనిపై సుజ్ఞాన చంద్రికలు ప్రసరించి, సరస్వతీ రూపంలో అండగా నిలచి, మహత్తర పాండిత్య విజ్ఞానం లభింపచేస్తుంది. దరిద్రంతో అలమటించే భక్తుల దయనీయస్థితిని ఆమాత చూడలేదు. అందుకే ఆజనని లక్ష్మీరూపం వహించి దీనజనులకు దివ్య మహిమల నందించి ధన కనక వస్తు వాహన వైభవములను నిస్తుంది. ఇది మనకోరికగాదు, మరి ఏ ఇతర కారణము గాదు, అట్లా సమయానికి ఆదుకోవటం ఒక తల్లిగా (విశ్వజనని) ఆమె బాధ్యత.

స్వరాలలో మొదటిది "అ" వ్యంజనములలో చివరిది "మ" ఈ రెంటి కలయికయే "అమ్మ" పుట్టిన ప్రతిజీవి తనకు తెలియకుండానే మొట్టమొదటగా పలికే పలుకు–ఈపలుకుకు పలకని తల్లి వుంటుందా? అన్ని అక్షరాలు అమ్మరూపాలే, అన్ని మంత్రాలకు ప్రారంభంలో వుండేది, యోగులు నిరతరం ధ్యానించేది పరబ్రహ్మతత్వాన్ని ప్రతిపాదించేదీ అయిన ఓంకారంలో గూడ మొదట– చివర అ, మ, లే వున్నవి. తుది మొదల్లో అమ్మ దర్శింపబడితే ఉకారరూపమైన ఈశ్వరుడు మధ్య భాగంలోవుండి ప్రణవం పరబ్రహ్మ రూపాన్ని పొందింది. అకార, ఉకార, మకారముల కలయికయే కదా "ఓం" కారోత్పత్తి.

ప్రకృతియే ఆదిశక్తి – పురుషుడే పరమేశ్వరుడు. వీరిరువురూ విశ్వము నందలి సమస్త సృష్టికి జననీ జనకులు. వీరే భక్తజనులను కరుణించి, కాపాడి, అభీష్టములు – దివ్య సిద్ధులు, కలిగించు దైవములు – కష్టములు తొలగించి కాపాడి, లాలించు తల్లిదండ్రులు అట్టి పరమేశ్వర నామమే శంభు శబ్దము. శంభునిలోనున్న చైతన్యవంతమగు శక్తియే శాంభవి. ఈ శాంభవీ శక్తిలేని పదార్థము లేదు. ప్రకృతికి సంబంధముగల ప్రతి జీవా జీవ పదార్థముల యందంతటను ఆదిశక్తి శాంభవీ రూపముగా నిబిడీకృతమై ఉన్నది. తనలో నిబిడీ కృతమై నిద్రాణముగా నున్న శాంభవీ శక్తిని సాధకుడు మేలుకొలుప గలిగినవాడు – సమస్త సిద్ధులు. అనగా – అణిమా, లఘిమా, గరిమా, మహిమా, ఈశత్వ, వశిత్వ ప్రాప్తి, ప్రాకామ్యాది అష్టసిద్ధులు సాధకునికి కరతలా మలకములై దివ్యత్వము నొందగలడనుటలో సందియమేమి యును లేదు.

# పాత్రతా - పద్ధతి

గురువు లేని విద్య గుఱ్ఱము లేని బండి వంటిది. ఏ విద్యకైనా తగిన గురువు చాలా అవుసరము. లోకంలో ప్రత్యక్ష దైవాలుగా చెప్పబడేవారు ముగ్గురు. వారే తల్లి, దండ్రి, గురువు. ఈ ముగ్గురినీ పూజించని వాని జీవితము నిరర్థకమని పెద్దలు చెప్పుచున్నారు.

ముఖ్యంగా మంత్ర శాస్త్రము నభ్యసింపగోరు సాధకులకు ఆవిద్యయందు పరిపూర్ణానుభవముగడించిన గురువు చాలా అవుసరము, పుస్తకాలలో వ్రాసే విషయాలు యెంత వివరించి వ్రాసినప్పటికీ కొన్ని అంతర్గతమైన విషయాలు భావగర్భితంగానే వుండే అవకాశములున్నవి. ఎందువల్ల ననగా? గ్రంథ రచనకు కొన్ని నియమము లేర్పడి యుండుట కొన్ని కొన్ని భావములను విపులీకరించుటకు సరియగు అర్థము ధ్వనించు పదజాలము కుదరకు పోవుట, మంత్రోచ్ఛారణమును వ్రాతలలో వ్యక్తీకరింపలేకపోవుట, మొదటగునవి చాలా వున్నవి. ఉదహారణగా, కొన్ని విషయాలను పరిశీలిద్దాము.

ఓం అనే శబ్దాన్ని మూడు మాత్రల కాలంలో నాభి స్థానం నుంచి పలకాలి అని వ్రాసి ఉంటే - సాధకుడికి నాభిస్థానం నుంచి ఎలా పలకాలో తెలీదు. దానిని పలికించేవాడు గురువు; ఆప్రకారమే కపాలమునందు అని చెప్పియున్నప్పుడు సాధకుడు పుర్రెను సంపాదింపగలడేగానీ, ఆపుర్రె యందు కపాలభాగమేదియో తెలియదుగదా? అది తెలుపు వాడు గూడా గురువే! కావున ఇటువంటివి

అనేకానేకములైన సాధనా సందేహములకు అనుభవ పూర్వకమైన మార్గములు సూచించుటగాక - అనుక్షణము తనశక్తిచేత సాధకుని రక్షింపుచూ- ఆత్మస్థైర్యమును చేకూర్చి ముందుకు నడిపింపగలవాడే గురువే. గురువు లేని విద్య ఫలింపనేరదని శాస్త్రములు చెప్పుచున్నవి. మా అనుభవంలో గూడా గురువు లేక గ్రంథములు జూచి సాధన చేసిన వారనేకులు, ఫలసిద్ధినందకపోగా అనేక ప్రమాదములకు లోనైయున్నారు.

గురువు నాశ్రయించుట తప్పనప్పుడు ఈ గ్రంథములతో పని ఏమను సందేహము కలుగవచ్చును. గ్రంథములు ప్రామాణిక నిర్దేశ్యములు. అనగా ఈపనికిదివిహితము, ఈపనికిదిఅవిహితము అని దెలియజెప్పుచూ - మానవ మేదస్సు లందు నిద్రాణమైయున్న, అనంత జ్ఞానశక్తిని మేల్కొల్పి చైతన్యము- ఉత్సాహము - అభిలాష, ఆసక్తి జనింపజేయుటకు మాత్రమే పనికి రాగలవు.

# గురూపదేశము

యక్షిణీతంత్రములు సాధింపదలచినవారి పాత్రత అనగా వ్యక్తి యొక్క ఉన్నతమైన అర్హతలు. ముఖ్యంగా బాగుండాలి. చెడుపాత్రలలో బోసినపాలు విరిగిపోవు విధముగా సాధకుని యందుగల చెడు స్వభావముల వలన అతనిచే జపించబడిన మంత్రశక్తి కూడా పాలవలె విరిగిపోయి, ఆశించిన ఫలితములకు మారుగా ఊహించని అనేక దుష్ఫలితములు సంభవించగల అవకాశమున్నది. అందువలన సాధకుని యొక్క శారీరక పరిశుభ్రత, మానసిక నిర్మలత్వము. సత్స్వభావము ముఖ్యమైన పాత్రత (యోగ్యతలుగా) దెలుపబడినవి.

ముఖ్యముగా సాధకుడు శారీరక, మానసిక, బ్రహ్మ చర్యమును, కఠోర దీక్షతో ఆచరింపవలసినయున్నది. తనను తాను పొగడుకొనుట లేక ఇతరుల తమని పొగడుచుండగా విని ఆనందించుట - తాను పరులను నిందించుట. అసత్య ఆశ్లీలభాషణములొనర్చుట వలన దైవశక్తి లభించుట కష్టము స్వల్పమైన నిద్ర, మితాహారము చాలా అవసరము సత్వగుణ ప్రధానమైన ఆహారము శ్రేష్ఠము, తమోగుణాత్మకమగు ఆహారము వదలి వేయదగియన్నది - వీటికి తోడు సాధకునికి శరీరదార్ఢ్యము - ధైర్యము సాహసములు - మానసిక నిబ్బరము - ఓర్పు - సహనము - యుక్తి - సమయస్ఫూర్తి వివేకము చాలా అవసరమైయున్నది - లక్షణములు పూర్తిగా గలిగిన వారే యక్షిణిని సాధించుటకుదగి యుందురు.

సాధకుని గత జీవితం ఏలావున్నప్పటికీ విద్యాసాధనను ప్రారంభింప దలచిన తోడనే తన పద్ధతులను తప్పక మార్చుకొన వలసివుంటుంది. ఎక్కువగా ఏకాంతంగానే కాలం గడపాలి, స్త్రీలకు, వినోదవిలాసాలకు దూరంగా వుండాలి. ఎక్కువగా మాట్లాడగూడదు – మౌనవ్రతం పాటిస్తే చాలా మంచిది. నిరాండంబ రంగావుండి, తన పనులు తానే చూచుకోవాలి. ఇతరులచే తనపనులు చేయించు కొనటం చాలా ప్రమాదం ఏమరుపాటు తొందరతనము యెట్టి పరిస్థితులలోను కూడదు. తనకు తెలియని విషయములను గురించి ఒకటికి పదిమార్లు గురువుల నడిగి తెలుసుకొని, ఆ విషయంతనకు బాగా "అర్ధమైనది" అనుకొన్నప్పుడే ఆపని ప్రారంభించాలి. కొన్ని ప్రత్యేక సందర్భములలో తప్ప జీవహింసను జేయగూడదు. ప్రోత్సహించటం గూడా పనికిరాదు. సాధకుడు అతి ముఖ్యముగా గమనించి ఆచరింపవలసిన దొకటి కలదు. తాను ఏవిద్యను సాధింపదలచినది మొదలగు సాధనా విషయములను గురవుకు తప్ప మరెవ్వరికీ తెలియనీయగూడదు (ఇదతి ముఖ్యమైన విషయము) సాధనా సమయంలో ఒంటరిగాగానీ లేక గురువుతో గూడా గాని వుండాలి. ఇతరులెవ్వరూ వుండగూడదు.

ఈ ప్రకారం పాత్రతా నియమాలు ఆచరణ పద్ధతులు కలిగియున్న సాధకుడు యక్షిణీ శక్తిని అతి సులభంగా సాధించి దివ్య శక్తులు పొందగలడనుటలో నెట్టి సందేహమును లేదు.

# అనుకూల - ప్రతికూలములు

సృష్టి అంతాగూడా పంచభూతముల సమ్మేళనమే! మంత్రాలు, వాటి దేవతలు–మనకోరికలు – వాటి ఫలితాలు గూడా ఆకాశ, వాయు – అగ్ని, జల, పృధివీ తత్వాలను పొందియున్నవి. విరుద్ధ తత్వాలుగల మంత్రాలు వాటికి విరుద్ధమైన కోరికల విషయంలో ఫలితాలనివ్వజాలవు. ఏ మంత్రము ఏవ్యక్తికి అనుకూలమో నిర్ణయింప బడి వున్నది. మంత్ర ప్రారంభంలో గల మొదటి అక్షరమునకు – సాధకుని పేరునందుగల మొదటి అక్షరమునకు పొంతన బాగుండాలి. అట్లా పొంతన కుదరనందువలన అనేక కష్టనష్టాలు సంభవింప గలవు. దీనినే అర్వణచూచుట అంటారు. సాధకుడు తనకిష్టమైన మంత్రమునకు ఈ అర్వణ చూచి అనుకూలంగా వుంటేనే ప్రారంభించాలి. లేకుంటే వేరొక మంత్రం అర్వణం బాగుండేది యెంచుకోవాలి. మూర్ఖించి చెయ్యరాదు.

1 సిద్ధ      2 సాధ్య

| | | | |
|---|---|---|---|
| 1 సిద్ధ<br>అకధ | 2 సాధ్య<br>ఉజప | 1 సిద్ధ<br>ఆఖద | 2 సాధ్య<br>ఊఛఫ |
| 2 అరి<br>ఓడవ | 3 సుసిద్ధ<br>ఌ ఝమ | 4 అరి<br>ఔఢశ | 3 సుసిద్ధ<br>ౡ ఞయ |
| 1 సిద్ధ<br>ఈఘన | 2 సాధ్య<br>ౠజభ | 1 సిద్ధ<br>ఇగథ | 2 సాధ్య<br>ఋచబ |
| 4 అరి<br>అంత సహళ | 3 సుసిద్ధ<br>ఐఠల | 4 అరి<br>ఆంణష | 3 సుసిద్ధ<br>ఏటర |

4 అరి      3 సుసిద్ధ

పై చక్రంలోని గళ్ళు అక్షరాలు బాగా పరిశీలించాలి. 16 గళ్ళు 4 భాగాలుగా విభజింపబడినవి, మొదటిభాగం సిద్ధ - 2వ భాగం సాధ్య, 3వ భాగం సుసిద్ధ, 4వ భాగం అరి (శత్రు) అనే పేర్లతో పిలువబడుజిరి. పేరు నందలి మొదటి అక్షరం ఏ భాగం గల గడిలో వుంటే వారికా భాగం సిద్ధి భాగం అవుతుంది. అక్కడి నుంచి సవ్య క్రమంలో మిగిలిన భాగాలు సాధ్య- సుసిద్ధ అరిభాగాలుగా వుంటాయి. సాధకుని పేరునందలి మొదటి అక్షరం గల భాగం నుంచి, మంత్ర ప్రారంభాక్షరం ఏ భాగంలో ఏగడిలో వున్నదో గమనించాలి. సిద్ధ, సాధ్య సుసిద్ధ, భాగములు  అందలి గడులు చాలా మంచివి, అరి భాగము అందలి గడులలో గల అక్షరములు మంత్రం మొదట్లో వుంటే ప్రమాదం - సిద్ధాది నాలుగు భాగాల్లోను మళ్ళీ సిద్ధ, సాధ్య, సుసిద్ధ అరి అనే ఉపభాగాలు గూడా గమనించాలి.

**ఉదహరణకు :** కేశవరావు అను పేరుగల వాని మొదటి అక్షరం క. ఇది నెం1 సిద్ధ భాగంలో 1వదగు సిద్ధగడియందున్నది - గణపతి మంత్రం. మొదటి అక్షరం గం, 3నెం సుసిద్ధ భాగంలో 1వదగు సిద్ధ గడియందున్నది కావున ఈ మంత్రం “సుసిద్ధసిద్ధము” చాలామంచిది. ఈ ప్రకారంగానే శశికుమార్ అను వాని మొదటి అక్షరం శ. వరుస నెం. 2 సాధ్య భాగంలోని 4వదగు అరగడిలోనున్నది. కానీ ఈ భాగం శ, పేరుల మొదటి గలవారికి మరియు (ఆ.ఖ.ధ. ఊచఫ. ఔఢశ. ఞయలు గలవారికి) నెం. 1 సిద్ధ భాగముగానే చూడాలి. వీరికి ఒక మంత్ర ప్రధమాక్షరమగు ఝం నెం. 4 అరిభాగమందలి 3వ దగు సుసిద్ధ గడియందున్నది. ఇది వీరికి అరిసుసిద్ధ మంత్రము - పూర్తిగా పనికిరాదు. ఈ విధంగానే సాధకులు ఈ అర్వణరీత్యా తమకు మంత్రమునకు పొంతన బాగున్నదీ లేనిదీచూచుకొని సాధన ప్రారంభించాలి.

# అర్పణ ఫలితం

## 1. భాగమునందలి.

1. సిద్ధ - సిద్ధము - క్రమము తప్పక చేయుట వలన ఫలము
2. సిద్ధ - సాధ్యము - చెప్పబడిన దానికంటే రెండింతలు జపించుట వలన ఫలితము కల్గును.
3. సిద్ధ - సుసిద్ధము - సగము జపము జరుగునప్పటికే ఫలితము కల్గును.
4. సిద్ధ - అరి - తన వంశము వారు నశింపగలరు.

## 2వ భాగము నందలి

1. సాధ్య - సిద్ధము - అధిక శ్రమకల్గి ఫలితందక్కుతుంది.
2. సాధ్య - సాధ్యము - బహుప్రయత్న మొనర్చుటవల్ల ఫలితం
3. సాధ్య - సుసిద్ధము- శీఘ్రముగా ఫలితం కల్గుతుంది.
4. సాధ్య - అరి - అన్ని విషయాల్లో హాని కల్గుతుంది.

## 3వ భాగము నందలి

1. సుసిద్ధ - సిద్ధము - ప్రారంభములోనే ఫలితం కల్గుతుంది.
2. సుసిద్ధ - సాధ్యము- హోమాది ఇతర తతంగముల వల్ల ఫలితం
3. సుసిద్ధ - సుసిద్ధము - తక్షణమందే సిద్ధింప గలదు.
4. సుసిద్ధ - అరి - సంతానము నశించి పోగలదు. (వంశహాని)

**4వ భాగము నందలి**

1. అరి – సిద్ధము – పుత్రుని జంపును.
2. అరి – సాధ్యము – పుత్రికను జంపగలదు.
3. అరి – సుసిద్ధము – భార్యను నశింపజేయును.
4. అరి – అరి – సాధకుని జంపగలదు.

## కాలము - ఉపయోగము

ఏ మంత్రమైననూ గురువు ద్వారా ఉపదేశించబండిన తరువాతనే జపించాలి. గురువు చెప్పిన పద్ధతులు తప్పకూడదు. ఉపదేశం పొందటానికి అన్ని కాలాలు, సమయాలు మంచివి గావు. చైత్ర, వైశాఖములు, శ్రావణము, ఆశ్వయుజ, కార్తీక, మార్గశిరములు, మాఘ, పాల్గుణమాసములు మంత్రోపదేశము నందుటకు శుభకరమైనవి - అధిక మాసము, క్షయ మాసము మూఢమి యుండు సమయము పనికిరావు.

శుక్ల, కృష్ణ పక్షములు రెంటియందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి. శుక్లపక్ష త్రయోదశీ తిధులు ప్రశస్తము మిగిలినవి పనికిరావు. సోమ, బుధ, గురు, శుక్ర వారములు అనుకూల ఫలితములనిచ్చును. రోహిణి, మృగశిర, పుష్యమి, అశ్విని, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు సాధకునికి క్షేమ, సాధనతారలు గలవీ. ఏ నక్షత్రమైనను పనికి వస్తుంది.

మిధున, కన్యా, ధనుర్మీనలగ్నములు గల కాలము యోగ్యమైనది. లగ్నమునకు శుభగ్రహదృష్టి – లగ్న, పంచమ అష్టమ శుద్ధి, కలిగి, పాపగ్రహములు, 3,6,11 స్థానములందును శుభగ్రహములు. 4,5,7,9,10 స్థానము లందుండు విధముగా ముహూర్తము నిర్ణయంచి మంత్రోప దేశములు నందవలెను.

మంత్రము జపించుటకు తూర్పు ప్రశస్తము. తంత్ర విద్యలందు మాత్రము ఉత్తర ముఖముగా జపించాలి. ఈశాన్య ప్రదేశంలో, పులి, లేక కప్ప, ఒంటెల యొక్క చర్మమును బరచి దానిపై పరిశుభ్రమైన వస్త్రమును బరచి భద్రాసన, పద్మాసన, స్వస్తికాసనములందే దేనినొక ఆసనమునందు గూర్చుండి మనస్సు ఏకాగ్రతపరచి తనముక్కు చివరి భాగంలో దృష్టికి కేంద్రీకరించి స్థిరచిత్తుడై, తొందర లేకుండా 108 తామరపూసలు లేక ముత్యాలు, రుద్రాక్షలు, గూర్చిన మాలను కుడిచేతి బొటనవ్రేలు ఉంగరపు వ్రేలు కలిపిపట్టుకొని నెమ్మదిగా అక్షరములు తప్పులేకుండా ఉచ్చరింపుచూ జపం చేయ్యాలి. ప్రతి మంత్రాన్ని సాధనకు ముందుగా నియమంతో గూడి పదివేలుజపించిన తర్వాతనే సాధనా క్రమంలోకి వెళ్ళాలి. ముందు మంత్రాన్ని కొంత జపించకుండా సాధన చెయ్యగూడదు.

# ఆత్మ రక్షణ

ప్రకృతి వివిధ దశలు కలిగివుంటుంది. ప్రచండంగా ఎండలచే తపింప జేయగలదు. సంతతధారగా కుంభవర్షం కురిపించగలదు. ఉధృతమైన గాలులచే తల్లడిల్ల జేయగలదు. సముద్రాలు పొంగొపొరల వచ్చు - భూమి కంపింపవచ్చు యివి అన్నీ గూడా ప్రకృతిలో కలిగే తీవ్ర పరిణామరూపాలు సాధన తీవ్రతరం అవుతున్నకొలదీ సాధకునికి మాయ ఆవరించి ప్రకృతి సహజమైన ఈ తీవ్ర లక్షణాలు తనను చుట్టు ముట్టు చున్నట్లుగా భ్రాంతి కలుగుతుంది. ఆ భ్రాంతికి లోబడిన సాధనకుడు తనదీక్షను విరమించే అవకాశములున్నవి. యివేగాక, సాధనా సమయంలో ఎన్నెన్నో మాయా మయమైన అద్భుతాలు గోచరించును. వాటన్నిటికీ స్థిరచిత్తుడై నిలబడి తనదీక్షను ఆపకుండా కొనసాగించాలి. అప్పుడే సిద్ధికలుగుతుంది.

వాయు మార్గంలో సదా నంచరించే విఘ్న కారకులైన గ్రహాలు సాధకుని కవరోధాలు కల్పించును. వీటినుంచి రక్షింపబడాలంటే ముందుగా ఆత్మరక్షణోపాయం ఆలోచించాలి. గిట్టనివారుంటారు. వాళ్ళు క్షుద్రశక్తులతో సాధకుని బాధింప జేయాలనుకుంటారు. అట్టి క్షుద్రశక్తులవల్ల ఏ బాధా లేకుండా ముందుగానే రక్షణపొందివుండాలి. దీక్షామధ్య కాలంలో ఏవిధమైన ఇతర మంత్రోచ్చారణలు తంత్ర కర్మలు పనికిరావు. గాబట్టి తగిన జాగ్రత్త ముందుగానే తీసుకోవడం మంచిది.

# ముందు జాగ్రత్తకు విధానాలు

అమావాస్య ఆదివారం రోజున (రాత్రి కాలంలో అమావాస్య తిథి వుండాలి) అర్థరాత్రి వేళ తెల్లజిల్లేడు చెట్టువద్దకు వంటరిగా వెళ్ళి ఆ చెట్టుకు పాదుజేసి నీరుపోసి, ధూపదీపము లిచ్చి నమస్కరించాలి. ఆ చెట్టు చూట్టూ నిమ్మకాయలు తిప్పి చెట్టు మొదట్లో కోసిపడవెయ్యాలి. (నిమ్మకాయలు) ఆ తర్వాత చెట్టుకు ముమ్మారు ప్రదక్షిణంగావించి, దింగబరుడై తూర్పు ముఖముగా కూర్చుని ఉత్తరంగా ప్రాకిన పిడికెడు లావుగల వేరును తీసి కిందపెట్టకుండా తీసుకోవాలి. తిరిగి చెట్టును పూడ్చి (చెట్టుచావకూడదు) ఇంటికి వచ్చిన తర్వాత ఆ వేరును కడిగి వసుపురాని ధూపంవేసి భద్రంగా అట్టిపెట్టాలి. సూర్యరశ్మి తగలకుండా ఆవేరును యెండించి దానితో తన బొటనవ్రేలు ప్రమాణం కల్గిన గణపతి విగ్రహం చేయించాలి. ఈ విగ్రహానికి ప్రాణప్రతిష్ఠ గావించి ఈ దిగువ మంత్రం 1 లక్షమార్లు జపించి ధారపోసి ఆ విగ్రహాన్ని లాకెట్‌లో బిగించి హారంగా మెళ్ళో ధరించిన యెడల అన్ని విధములైన ఉపద్రవములు, విఘ్నములు, భ్రాంతి, మాయ అంతరించి, సాధకునికి తాను చేయు కార్యము నిర్విఘ్నముగా పూర్తియగుటకు సహకరించగలదు.

**మంత్రం :**

**ఓం హ్రీం శ్రీం హం యం రం దం లం - గం గణ**
**పతయే వరవరద సర్వ విఘ్నాన్నాశయ శ్రీం హ్రీం స్వాహా॥**

# రెండవ విధానం

సూర్యగ్రహణం పట్టిన సమయంలో స్నానం చేసి (తలస్నానం) శుచిగలవాడై ఊరిబైటనున్న మేడి, మాదీఫల, తెల్లజిల్లేడు, తెల్లగురువింద, ఉచ్చిత చెట్లయొక్క వేర్లు త్రవ్వి తీసుకురావాలి. తూర్పుగా ప్రాకిన గురువిందవేరు, దక్షిణంగా ప్రాకిన మేడివేరు, పడమరగా ప్రాకిన మాదీఫల వేరు, ఉత్తరంగా ప్రాకిన తెల్లజిల్లేడు వేరు, అడుగునకు ప్రాకిన ఉచ్చింతవేరు శ్రేష్ఠము – ఇంటికి వచ్చిన తర్వాత ఈవేళ్ళు అన్నీ కడిగి చిన్న చిన్న ముక్కలుగా కోసి పసుపురాచి ధూపంవేసి ఒక రాగితీగెకు పూసలవలె తొడగాలి. ఆ తర్వాత మూడు రోజులు నిత్యం పూజ జరుపుచూ ఈ క్రింది మంత్రం పదివేలు జపంచేసి ఆమాలకు ధారాదత్తం చెయ్యాలి. ఆ తర్వాత ఆపూసలు గల రాగితీగను తన కుడిచేతి మణికట్టుకు ధరించిన యెడల క్షుద్రశక్తులనుంచి రక్షణలభిస్తుంది. మంత్ర, తంత్ర, యంత్రముల ద్వారా సాధకునికెవరే అపకారమొనర్చినను వెంటనే ఒక పూస పగిలిపోతుంటుంది. సాధకుడు నిరపాయంగా తనకార్యక్రమాన్ని నిర్వహించుకొనగలడు.

**మంత్రం :**

**ఓం ఆంహ్రీంక్రోంనమో భగవతీ, భద్రకాళీ,**
**కరాళవదనే శతసహస్రజిహ్వే, రంరంరం, ఖేం**
**ఖేం, శత్రుకృత సకలాభిచారన్ నాశయ**
**నాశయ – మమ ఆత్మరక్షాం శీంఘ్రం కురుకురు**
**ప్రసన్నందాపయ దాపయస్వాహా ॥**

ఈ మంత్రం దినమునకు 3333 చొప్పున మూడు దినములు జపించి పూలు అక్షతలు నీళ్ళతోమాలకు ధారపోయాలి.

# జన - గ్రామ - మృగ - వశీకరణ

**1.మంత్రం :**

**ఓం ఐంహ్రీంక్లీం ఐంక్షౌం భోగప్రదాభైరవీ**
**మాతంగి, త్రైలోక్య జనాన్ శ్రీఘ్రంమే**
**వశమానయ వశమానయస్వాహా ॥**

ఈ మంత్రం దీక్షానియమవ్రతములు కల్గి 40 దినములు దినమునకు 2500 వంతున లక్ష జపము గావించిన యెడల సిద్ధి నొసంగగలదు. దీని ప్రభావము వలన సాధకునికి జనసందోహము వశమగును. అందరూ సాధకుని పూజించి గౌరవించగలరు.

**2.మంత్రం :**

**ఓం నమః కటవికట ఘోరరూపిణి క్లీం క్లీం**
**క్లీం, హ్రీం హ్రీం హ్రీం హుంఫట్ స్వాహా॥**

ఈ మంత్రమును దీక్షావ్రత నియమము గల్గి లక్షసంఖ్య వరకు జపం చేసిన తదుపరి సిద్ధినివ్వగలదు. సాధకుడు ఏగ్రామమైనను వెళ్ళినప్పుడు ఊరికి ముందట ఏడురాళ్ళు తీసుకొని ఈ మంత్రం నూట ఎనిమిదిమార్లు జపించి ఆరాళ్ళను ఒక్కొటొక్కటిగా ఏదో ఒక చెట్టుకు వేసికొట్టి ఆవూరిలోనికి ప్రవేసించిన యెడల ఆగ్రామ వాసులచే పూజింపబడగలడు. ధనవస్తు సాధనా సంపత్తులు లభించగలవు.

**3.మంత్రం :**

**ఓం హ్రీం క్షేత్రపాలకాయ భైరవరూపాయ**
**శంభవే హ్రీంమలవయూంమమ సర్వస్థలేషు**

**సర్ప - చోరవ్యాఘ్రాది క్రూరమృగ బాధాం**
**నాశయనాశయస్వాహా**

ఈ మంత్రమును ముందుగా దీక్షానియమములు గల్గి ఒక లక్ష జపం చేయుటవలన సిద్ధించగలదు. అవసర సమయములందీ మంత్రమును స్మరింపుచున్న సర్పములవలన చోరుల వలన, పులులు మొదలగు క్రూర జంతువులవలన బాధలు లేక సాధకుడు నిశ్చితంగా తనకార్య క్రమమును నెరవేర్చు కొనగలడు.

## సర్వసిద్ధి మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రీం పరబ్రహ్మమాత్మనే, ఉత్పత్తిస్థితి ప్రళ**
**యకరాయ, బ్రహ్మహరి హరాయ, త్రిగుణాత్మనే,**
**శ్రీం హ్రీంక్లీం, ఐం సర్వకేతుకానిదర్శయ,**
**శాబర విద్యాసిద్ధింకురు కురుస్వాహా ॥**

ఇది త్రిమూర్త్యాత్మకమైన మంత్రం, యక్షిణీ విద్యా సాధనకు ముందుగా ఈ మంత్రమును ఒక లక్షాపదివేలు దీక్షగా జపించి సిద్ధిపొందినగానీ, యక్షిణీ శక్తినందలేరు. ఈ మంత్ర సిద్ధివలన సాధకునికి గొప్ప ఆత్మస్థైర్యము, నిర్భయత్వము, విఘ్నములు లేక కలిగి సాధన సులువుగా నెరవేర్చ గల ధైర్య సాహసములు లభించును.

# శాంభవీశక్తి

సకల శాబర, దేవశాబర విద్యలకు అధిష్ఠాత్రి శాంభవి, ఆదివ్య జననిని నిరంతరము మనస్సున ధ్యానం చేయువారికి ప్రజ్ఞ – మేథ, యశస్సు, కీర్తి సౌఖ్యాదులే గాక మహత్తరమైనదివ్యశక్తులు సిద్ధించును. సాధకుడు కఠోర బ్రహ్మ చర్య దీక్ష గలిగియున్నన్నాళ్ళు ఆదేవి కరుణ ఆతనిపై అపారంగా వుంటుంది. నియమనిష్ఠలతో సాధించిన శక్తులు తొలగిపోయినప్పటికి – ఆదిమూలమైన శాంభవి సాధకుని కన్న బిడ్డవలె రక్షించి కాపడుతుంటుంది.

ఈదేవికి కావలసిందల్లా తన భక్తుడు. వ్రతత్రయములను పాటించుటే! వ్రతత్రయములనగా 1. సురాపానము చేయకుండుట 2. మాంసభక్షణ చేయకుండుట 3. శరీర మానసిక వ్యభిచారములకు పాల్పడక ఇంద్రియ నిగ్రహణ కల్గియుండు. ఈ మూడు నియమములు పాటించు భక్తుడు, స్నాన సంధ్యాదులను వదలినను, మరి ఏ ఇతర ధర్మములు పాటింపకున్నను దేవి క్షమిస్తుంది.

అమ్మ "నామపారాయణప్రీత" అందువలన సాధకులు వీలు కుదిరనప్పుడెల్లా అమ్మను స్తుతిస్తుండాలి. ఆమె "స్తుతిమతి" అన్ని శక్తులకు, అవతారాలకు, ఆదిమూలమాత్రిపురసుందరి ఆ జగజ్జనని నామాలు అనంతాలు. మనకందుబాటులో నున్నవి "లలితా రహస్య నామములు" వాటిని పదేపదే గానం చేస్తే గుక్కపెట్టి ఏడ్చే పిల్లవానిని

ఒడిలోకి తీసుకొని లాలించే తల్లిలాగా భక్తుణ్ణి తన అమృత హస్తాలతో లాలిస్తుందా పరమేశ్వరి, ఆతల్లి కృపలేకుండా సాధించగలిగిందేమీలేదు.

**శాంభవీ మంత్రం :**

**ఓం ఐంహ్రీంశ్రీం ఐంక్లీంసౌః శంభుతేజోద్భాసినీ**
**శాంభవీ శాంకరీ ఆంహ్రీంక్రోం పరమేశ్వరీ**
**మమహృదయం ప్రవిశ్య ప్రవిశ్య, మేథాం, ప్రజ్ఞాం**
**యచ్ఛ యచ్ఛ, అష్టసిద్ధిం దేహి దేహి, ఓంహ్రీం**
**శ్రీం క్లీం హుం ఫట్ స్వాహా ॥**

నియమంతో పదివేలకు మించియెంతైనా జపింప వచ్చును. నిత్యము 108 జపించుటవలన విశేష ఫలితములు కలిగును. ఎల్లవేళలా మానసికంగా జపంచెయ్యటానికి అలవాటుచేసి కోవటం యింకామంచిది. పశుపుత్ర పత్నీ గృహరక్షణలేగాక సాధకుని యెల్లవేళలా కాపాడుతూ, సకల భోగాలు లభింపజేస్తుందా పరమేశ్వరి.

## వ్రత - దీక్షా - నియమం అంటే ఏమిటి?

ఒక మంత్రాన్ని నిర్ణీత సంఖ్య వరకు జపం చెయ్యవలసి వచ్చినప్పుడు ఆజపకాలం అంతాగూడా వ్రతకాలం అవుతుంది. తన మనస్సును ధ్యాసనను. ఇతర విషయముల పైకిపోనీకుండా సాధనాకార్యమందే యెల్లవేళలా లగ్నం చేసి వుంచటం దీక్ష - ఈవ్రత కాలంపూర్తి అగువరకు మౌనంగానీ మితభాషణ కల్గియుండుట - బ్రహ్మచర్యము - ఏకభుక్తము భూమిపై పడుకొనుట - ప్రయాణములు చేయకుండుట క్షౌరము చేయించుకొనకుండుట - సాత్వికాహారసేవనము మూడు వేళలా స్నానము చేయట - నిర్ణీత కాలమునకు జరుపవలసిన కార్యక్రమములు జరుపుట, దైవధ్యానము - గురుభక్తి విశ్వాసము - అనునవి నియమములు వీటిని తప్పక పాటింపుచూ మంత్ర జపంగావించాలి.

# అత్యద్భుతశక్తిగల యక్షిణీ మంత్రములు

యక్షిణీ మంత్రమనగా అప్పటికప్పుడే ఫలితములు నిచ్చునది పరమేశ్వరీ పరివారమైన యక్షిణీదేవతలు సాధనకుని కోరికలు సత్వరమే ఫలింపజేయగలరనుటలో నెట్టి సందియము లేదు. కొన్ని మంత్రములకు కొన్ని ప్రత్యేకనియ మములేర్పడియున్నవి. ఆ నియములను సాధకుడు ఉల్లంఘించ కూడదు. యక్షిణీ మంత్రసాధన క్లిష్టతరమైయున్నందున అతి జాగ్రత్తగా నిర్వహించవలెను. తొందరపనికిరాదు. ధైర్యం చాలా అవుసరం. ఎప్పటికప్పుడు వివేకంతో ప్రవర్తిస్తుండాలి.

యక్షిణీ సాధనవల్ల యెంతటి అద్భుత ప్రయోజనములు గలవో అంతటి కీడుగూడావున్నది. సాధనా సమయంలో సాధకుని మనోనిశ్చలతను, సహన శక్తిని, దీక్షా దృఢత్వమును పరీక్షించుటకు యక్షిణీ దేవతలు, అనేక పరీక్షలు పెట్టి సాధకునికి భయోత్పాతములు కలిగింపుచును. అవి ఏ రూపంలో రాగలవో నిర్ధారించటం బహు కష్టము. ఆ పరీక్షలకు నిలువ గలిగిన సాధకునికే ఆ దేవతలు అనుగ్రహం లభిస్తుంది. ఏ పొరపాటు వల్లనైన సాధకుడు పరీక్షకు నిలబడ లేకపోతే అతనికి మతిచలించి పిచ్చివాడు గావచ్చు, లేక దీర్ఘ వ్యాధులపాలుగావచ్చు, ఇంద్రియ నిగ్రహత్వము, ధైర్య సాహసములు లేనివాడు వీటిని సాధింపరాదు.

అనుభవంలో అనేకమంది యక్షిణీ సాధకులు జరిపిన వారిని పరిశీలించి వివరాలు సేకరించటం జరిగింది. ఈ సాధనలో పూర్తి సిద్ధిని పొందినవారు అతిస్వల్పం – ఎక్కువ భాగం పరీక్షకు నిలబడలేక అనేక విపత్కర పరిస్థితులు కొని తెచ్చుకున్నవారే, కలికాలంలో అప్పుడు మేధస్సు గలవారైన మనుష్యులు ఇంద్రియాదులను నిగ్రహంగావుంచుకోవటం చాలా కష్టం. ప్రకృతి పరిస్థితులు గూడా చాలా మార్పు జెందినవి, ఋతుధర్మాలే సక్రమంగా కొనసాగుటలేదు. ఇట్టి పరిస్థితులలో అతి ప్రాచీనమైన కాలంలో చెప్పబడిన ఈ సాధననియమాలు పాటించటం చాలా దుర్లభం.

పాఠకులు మన శాస్త్రీయ విషయలలో ఉన్న గొప్పతనాన్ని అర్థంచేసు కోగలందులకే ఈ విషయాలు వ్రాయబడుచున్నవి గాని, అత్యాశతో ఆచరణకు తెచ్చుట కొరకు వ్రాయబడలేదు. లోగడ ఈ యక్షిణీ విద్యను సాధించి ఉన్న గురువు దొరికిన కొంత వరకు సాధించుట కొరకు ప్రయత్నింప వచ్చును. పుస్తకము చూచి సాధనా ప్రయత్నములు చేసిన గొప్పహాని సంభవింపగలదు.

# భోగయక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం నమో ఆగచ్ఛసురసుందరీస్వాహా ॥**

ఈ మంత్రమును సాధింపగోరువారు మౌనవ్రతం కల్గి వుండాలి. తెల్లనిబట్టలు మాత్రమే ధరించి, పాలఅన్నము మాత్రమే ఒకపూట దినుచూ దీక్షాధారియై, నిర్జనప్రదేశములందు రాత్రివేళ దినమునకు 2500 వంతున 21 దినములు పై మంత్రమును జపించవలెను. చివర్లో పంచామృతములు అనగా ఆవుపాలు, ఆవు పెరుగు, తేనె, పంచాదార వీటితో కలిపి ఆ ద్రవ్యంతో ఆరు వేల మార్లు యక్షిణీ ప్రీతిగా హోమం చెయ్యాలి. హోమం ముగిసిన పిదప, పచ్చ కర్పూరము, కుంకుమపువ్వు, పంచదార కలిగిన ఆవుపాలతో ఆరువందల పర్యాయములు క్షీరతర్పణగూడా చెయ్యాలి.

యధాక్రమంగా ఇరువదొక్క రోజులు సాధనను నిర్విఘ్నంగా పూర్తిగావించిన సాధకునికి భోగయక్షిణి ప్రత్యక్షము కాగలదు. ఆమె దర్శనము వలన సాధకుని శరీరము నూతన దివ్యనుభూతులతో నిండి, సంతోషము నందగలడు. యక్షిణీ వరమిచ్చి అదృశ్యమైన వెంటనే సాధకుడు అన్న దానము గావించుట మంచివి.

భోగయక్షిణీ మంత్రసిద్ధి కలిగిన వానికి సకల భోగములు, సంపదలు సమకూడి నిరంతరానందమయైన జీవితము గడుపు

చుండును. ప్రతి దినము యక్షిణీదేవత సాధకునికి ఐదు బంగారు నాణెములు ఇచ్చిపోవుచుండగలదు. సాధకుడు తన నియమము తప్పనంతకాలము ఈ ప్రకారవే బంగారు నాణెములు పొందుచుండగలడు. యక్షిణీ దేవత ఇచ్చిన ద్రవ్యంలో కొంత భాగ్యం ధర్మకార్యములకు (ముఖ్యంగా అన్నదానమునకు) వెచ్చింపుచున్న సాధకుని పుత్రపౌత్రులు గూడా సకల భోగ–భాగ్యములు గలిగియుండ గలరు. స్వార్థమే పరమావధిగాగల సాధకుడు పరమార్థమును జూడని యెడల ఈ సరిసంపదలాతనితోనే అంతరించి – సంతానము, మిగిలిన వంశముల వారు గొప్ప దరిద్ర బాధలు పొందెదరు.

యక్షిణి దర్శనమిచ్చినప్పుడు మనస్సు చలింపకూడదు. ఆ దేవత పాదములకు నమస్కరించి అంజిలి ఘటించి వినయంగా ఒక్క ప్రక్కన నిలబడి వుండాలి. దేవతను స్తోత్రం చేసి "స్వర్ణరత్న మణి వస్త్రాద్యాభరణ భోగసౌఖ్యం దేహిదేహి" అని పలకాలి. అప్పుడా దేవత "తథాస్తు" అని పల్కుటగానీ, లేక ఏదేని సాధకుని కొసంగుటగానీచేసి అదృశ్యము కాగ లదు. అట్లు జరిగిన యెడల మంత్రసిద్ధి చేకూరినట్లు గ్రహింపవలెను".

# వశీకరణ యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం ద్వారదేవతాయై హ్రీం సాహా ।**

జీవ నదీతీర మందు నదియొడ్డున తనకెట్టి ఆటంకములు కలుగని స్థలమందీ మంత్రమును పురశ్చరణ గావింపవలయును. 40 దినములు దీక్ష గలిగి ప్రతి దినము నదియందలి మట్టిని ముద్దగా జేసి తనముందిడుకొని – శుచిర్భూతుడై సాధకుడా మట్టిముద్దును పూజించి పై మంత్రమును 5500 మార్లు జపించు చుండవలెను. మధ్యలో కలుగు ఉపద్రవములకు చలింపక తన సాధన కొనసాగించినపిమ్మట, హోమగుండము నేర్పరచి పై మంత్రముతో 22 వేల పర్యాయములు నెయ్యి గలిపిన గుగ్గిలమును హోమము గావించిన యక్షిణీదేవి దర్శనమివ్వగలదు.

యక్షిణీ దర్శనముచే సాధకునకు మైకము రావచ్చును. కనుక ముందు జాగ్రత్తలు తీసుకొని యక్షిణీదేవిని స్తుతించిన యడల ఆ దేవత సాధకుని ఆశీర్వదించి హోమగుండము నందంతర్ధానము జెందును. అదియే సాధకునికి సిద్ధి, వరలబ్ధిగా దలంపవలెను. అటు పిమ్మట ఆ హోమగుండము నందలి భస్మమును జాగ్రత్తపరచి ఆ భస్మము నెవరిశిరముపై వైచిన వారెల్లరు సాధకునికి తక్షణమందే వశవర్తులై సకలమనోభీష్టములు నెరవేర్పగలవు. రాజులు, స్త్రీలు, పండితులు, శత్రువులు – మొదలైన వారెల్లరూ ఆభస్మశక్తి వలన కింకరులవలే మెలగి సాధకుని ఆజ్ఞలు పాటింపగలరు.

ఈ సాధన సిద్ధించిన పిదప సాధకుడు వేరొక మంత్ర సాధన చేయగూడదు. అట్లొనర్చిన పూర్వము చేసిన ఈ వశీకరణ యక్షిణీ శక్తి నశింపగలగు. ఈ యక్షిణీ ప్రభావమనన్యము సాధకుని సంకల్ప మాత్రముచే రాజులు చతురంగబలయుక్తులై గృహము ముంగిట సాధకుని దర్శనమునకై వేచియుండగలరు. యెల్లజనులు సాధకుని దర్శన, వీక్షణ, భాషణ స్నేహముల నపేక్షించి చంద్రుని కొరకు చకోరములవలే ఎదురు జూచుచుండెదరు. సాధకుని సర్వమనోభీష్టములు సిద్ధింపగలరు.

# అదృశ్య యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం కనక వతి కరవీరకే స్వాహా ॥**

ఊరిబైట పాడుబడిన శివాలయమునందీ విద్యను సాధన చేయ వలయును. ఏ నెలయందైనను బహుళ అష్టమీ తిథినాడు ప్రారంభించి అమావాస్య వరకు గల ఏడు దినములు ఉపవాస వ్రతదీక్షగలవాడై ప్రతిదినము రాత్రివేళలందు శివలింగము వద్ద దక్షిణ ముఖముగా కూర్చుని దినమునకు ఎనిమిది వేలు పై మంత్రం జపంచేయవలెను. ఈ జపసమయంలో రోజు రోజుకీ అనేక భయానక సన్నివేశములు కనుపించును. కొందరికి మొదట్లో మామూలుగానే వుండి చివరిరోజున ఆకస్మిక పరీక్షలు కలుగుచుండును. వేటికీ చలింపని స్థిరచిత్తంతో మొత్తం

అన్ని దినములు జపం పూర్తిగా గావించి ఆఖరిదినమందు (అమావాస్య) హోమము బెట్టి వేపపుల్లలతో, నేతితో 5600 మార్లు - హోమం గావించిన. ఆ హోమగుండము నుండి యక్షిణీ దేవత దర్శన మివ్వగలదు.

ఏ విధమైన భయము, మోహము, తొట్రుపాటు లేక ఆ దేవతకు ప్రదక్షిణము గావించి చేతులు జోడించి వినయంగా ప్రార్థించాలి. అప్పుడా యక్షిణీ చిరుమందహాసం చేస్తుంది. ఆ సమయంలో సాధకుడు "అదృశ్యకరణ శక్తిం దేహి దేహి" అని దోయిలిజూపవలెను. అప్పుడా దేవత తథాస్తు అని అదృశ్యమగును. సాధకుడు వరలబ్ధి పొందినట్లుదలచి, పరమేశ్వరుని (లింగమును) పూజించి హోమభస్మమును మొత్తము జాగ్రత్త పరచుకొనవలెను. పాడ్యమి రోజున అన్న సంతర్పరణ గావించి, పెద్దల అశీర్వాదము పొందవలెను.

ఈ ప్రకారము యక్షిణీ సిద్ధిని పొందిన సాధకుడు హోమ భస్మము నందు ఆవు నెయ్యి కలిపి పదకొండు మార్లు యక్షిణీ మంత్రం జపిస్తూ ఆ భస్మమును రంగరించి నుదుట తిలకముగా బెట్టుకొనగా ఇతరులెవ్వరికీ కనుపింపక అదృశ్యరూపము నందగలడు. తాను కనుపింపవలెనని దలచినప్పుడా తిలకమును ఎడమ చేతితో చెరిపివేసిన తిరిగి అందరికీ కనుపించగలడు. సాధకుడు తిలకమును ధరించి యుండగా, దేవాలయ ములకు పోవుట, స్త్రీ సంగమ మొనర్చుట పనికిరాదు. శక్తి నశింప బడగలదు.

# విద్యా యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రీం వేదమాతృభ్యః స్వాహా ॥**

కాళికా దేవిగుడిలో ఈశాన్యమూలగా ముప్పది రెండు మూరలు గల (16 గజాలు) ప్రదేశాన్ని చక్కగా ఆవుపేడచే ఆలికించి, వివిధ రంగులు గల ముగ్గురు దీర్చి దాని మధ్యన షోడశ దళ పద్మము లిఖించివుంచవలెను. సాధకుడు శుచిర్భూతుడై వ్రతదీక్షను స్వీకరించి మరియు మౌనవ్రతము గలవాడై, షోడశదళ పద్మం మధ్యలో జింక చర్మము వేసి, దానిపై తూర్పు ముఖముగా కూర్చుని జపం ప్రారంభించాలి. తనకు సాధన, మిత్రతారలు గలిగిన బహుళ దశమినాడు వ్రతదీక్షబూని, శుద్ధచతుర్ధశి వరకు గల ఇరువది రోజులు దినమునకు 2500 వంతున మంత్రజపము గావింపుచూ కేవలం ఫలములు, పాలు మాత్రమే ఆహారంగా తీసుకుంటూ తదేక దీక్షతో రాత్రి వేళలందు తనసాధన కొనసాగించాలి. ఏ అవాంతరములకు చలింపగూడదు.

పున్నమిరోజు రాత్రిపూట నలుగురు యోగ్యమైన స్త్రీలకు అభ్యంగ స్నానము జేయించి తెల్లని నూతన వస్త్రములను ధరింపజేసి వారిని తాను కూర్చొను షోడశదళ పద్మామునకు నాల్గు దిక్కులందు ఆసనములు వైచి తన వైపునకు వారి ముఖములుండు విధముగా కూర్చుండ జేయవలెను. ఈ స్త్రీలలో తూర్పున కూర్చున్నవారికి 8 సం॥ దక్షిణ దిశ యందు నియమించు నామెకు 16 సం॥ పశ్చిమ దిశయందలి స్త్రీకి, 24 సం॥ ఉత్తరమున, 32 సం॥ గల స్త్రీలనే కూర్చుండ జేయవలెను.

సాధకుడు తెల్లని వస్త్రములు ధరించి తుర్పు నుంచి వరుస క్రమంలో ఆ స్త్రీలను గంధపుష్పమాల్యాదుల చేత ధూపదీప నైవేద్యాదులచేత విధిగా పూజించవలెను. ఐదు పంచామృత కలశములుంచిని వేదించి, అందునాల్గు కలశములు వారి నల్గురికీ త్రాగుటకు నొసంగవలెను. అటు పిమ్మట అగ్నిని ప్రజ్వలింపజేసి మోదుగ సమిధలు, ఆవునెయ్యి మరియు ఐదవకలశము నందలి పంచామృతములు కలిపి 10,000 పర్యాయములు హోమము గావింప వలెను. ఈ హోమ సమయంలో ఈ నల్గురు స్త్రీలలో ఎవరో ఒకరిపైకి యక్షిణీ దేవత ఆవహింపగలదు. దానికి గుర్తుగా దేవత ఆవహించిన స్త్రీ వికార చేష్టలు గావించి సాధకుని ప్రలోభపరుచుటకు ప్రయత్నిస్తూ వుంటుంది. లేక 8 సం॥బాలికపై ఆవహించిన ఆ బాలిక లేచి వెళ్ళిపోతానని, నాకు భయంగావుందని బెదిరిస్తూ కొన్ని సందర్భాలలో పెద్దగా నవ్వటం, అతిగా ఏడ్వటం, ఇతరులకొరకై పెద్దగా కేకలు వేయటం చేస్తుంటుంది. ఈ ఆలజడికి సాధకుడు తన మౌనవ్రతాన్నిగానీ, కార్యక్రమాన్ని గానీ వదలకూడదు. తన ధ్యాసను, ఏకాగ్రతను మరల్పుగూడదు. ఏదియేమైనప్పటికీ ఆ హోమ కార్యక్రమం పూర్తి గావించాలితనతో పాటుగా ఈ హంగామాకు మిగిలిన స్త్రీలు బెదరి భయపడి పారిపోకుండా ముందుగానే జాగ్రత్త వహించాలి. యిట్లు ధైర్య సాహసాలతో హోమం పూర్తిగా ముగించేసరికి యక్షిణి ఆవహించిన వ్యక్తి సాధకునివంక తీవ్రంగా, అతదేకంగా చూడటం జరుగుతుంది. అప్పుడు సాధకుడు లేచి ఆ దేవతావహించిన వ్యక్తికి ప్రదక్షిణం గావించి, సాష్టాంగ నమస్కారం చేసి, అంజలి ఘటించి ప్రార్థించి "భోమాతా! విద్యాందేహిం, ధనందేహి, సుఖందేహి, యశందేహి" అని గంభీరంగా

పలకాలి. తక్షణమందే యక్షిణీ అనుగ్రహం లభిస్తుంది. ఆ యక్షిణీ అవహిత వ్యక్తి వైకం వచ్చినట్లుగా ఊగి తానుత్రాగిన పంచామృతములను వాంతి చేస్తుంది. ఆ అదనులో సాధకుడు ఒక పాత్రలో వాంతియొనరించు పంచామృతములనుబట్టి "కృతార్థాస్మి మాతా కృతార్ధోస్మి" అని పలుకుతూ ఆ పంచామృతములను పూర్తిగా త్రాగవలెను.

ఇదంతా చిత్రంగా జరిగిపోతుంది. అంతా తేరుకుంటారు. సాధకుడికి ఒడలు, మెదడు విచిత్రానుభూతుల ప్రకంపనలలో తేలిపోతుంది. అట్లా జరిగితే యక్షిణీ సిద్ధిచేకూరినట్లే! ఆ తర్వాత సాధకుడా స్త్రీల నుచితరీతి సత్కరించి పంపివేయాలి. అది మొదలుకొని సాధకునికి అన్ని విద్యలు కరతలామలంకమగును. అక్షరజ్ఞానం లేనివాడుగూడా మహా పండితుడై ఏ విద్యయందైనా తన ప్రావీణ్యాన్ని వెల్లడిస్తుంటాడు. పండితలోకంచే పూజింపబడతాడు. ధన-ధాన్య సంపదలు సులువుగాచేకూరి అఖిల సుఖాలు పొందుతాడు. అందరిచేత కీర్తింపబడి దిగంతకీర్తిని సంపాదించి, ఖ్యాతి గడించగలడు.

ఈ సాధన బహు కష్టతరమైనదైనా ఫలితం విశేషలాభకరమైనది. దీన్ని సాధించటానికి ఓర్పు, నేర్పుతో బాటుగా ధనంగూడా బాగా అవసరం. అన్నిటికన్నా ముఖ్యం తనచెప్పుచేతలలో వుండే స్త్రీలు లభించటం, యివన్నీ సక్రమంగా సమకూరినా చివరి క్షణంలో కలిగే పరీక్షలు, హటాత్పరిణామాలు నిగ్రహించుకోవటం అతిదుర్లభం. చాలామంది ఈ సాధనచేసి చివర్లో నిగ్రహించుకోలేక మతిస్థిమితం లేక తిరుగుతున్నారంటే అతిశయోక్తి కాదేమో?

# మదనమేఖలా యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రూం మదన మేఖలేనమః స్వాహా ॥**

తన కనుకూలమైన వాతావరణంగల ప్రదేశంలో ఇప్పచెట్టు క్రింద ఈ మంత్రసాధన నిర్వహించాలి. ఈ ప్రాంతము లందు ఇతరులు తిరుగకుండా చూచుకోవాలి. ముందుగా ఆ చెట్టు క్రింద స్థలమును బాగుచేసి అలికించి ముగ్గులు వేయించాలి. పూర్ణిమ లేక శుక్రవారము రోజున ప్రారంభించి వరుసగా 41 రోజులు రాత్రి వేళలందీమంత్రమును దినమునకు 8 వేలవంతున జపించి, నలుబది ఒకటవనాడు ఆవునెయ్యి, అన్నము, ఇప్పపూలు, సుగంధ ద్రవ్యములతో 32 వేలు హోమము గావించిన ఆకాశము నందు పెద్ద శబ్దము ధ్వనించి కనులు మిరుమిట్లు గొల్పు కాంతి ఒకటి భూమిపైకి (సాధకుని వద్దకు) వచ్చును. అప్పుడు సాధకుడు భీతిజెందక అంజలి బద్ధుడై దేవతకు ప్రార్థింపగా మదనమేఖల ప్రత్యక్షము కాగలదు.

సాక్షాత్కరించిన యక్షిణికి ప్రదక్షిణ నమస్కారములు గావించి "పాహిమాంమాతా పాహిమాం వరందేహి వరందేహి" అని ప్రార్థింపగా ఆ దేవత సాధకునికొక దివ్యాంజనములు ప్రసాదించి (ఇచ్చి) అదృశ్యమగును. సాధకుడా అంజనమును అతిజాగ్రత్తగా భద్రపరచి, అవసరమగునపుడు యక్షిణిని స్మరించి కన్నులకు ధరించిన యెడల, అదృశీకరణ శక్తి లభించి అతడెవ్వరికీ కనుపపింపడు. కనుపింపక దాగి వున్న వన్నియూ స్పష్టముగా కనుపింపగలవు.

ఈమదన మేఖలయక్షిణి సిద్ధివలన సాధకుడు అదృశీకరణశక్తి పొందుటయేగాక, ధనభోగసంపదలనంది సుఖింపగలడు. భూమి యందలి నిధులు, నీటియందలి నిధులు, నీటి యందలి వస్తువులు, మార్గరహితమైన గుహలు, బిలములందలి విషయములు సాధకుని దృష్టికి కనుపింపగలవు. ఈ విద్యయందు సాధకుడు జాగ్రత్తగా మెలగుట అవసరము. దేవత యొసంగిన అంజనమును ఇతరులు చూచినను స్పర్శించినను, కష్టించి సాధించినసిద్ధి నశింపగలదు. అంజనము ధరించి దేవాలయము లకు వెళ్ళ కూడదు. స్త్రీ సంగమము చేయగూడదు. ఈ నియమములను తప్పక, ప్రతి దినముగానీ లేక ప్రతిపూర్ణిమ యందు గానీ 108 మంత్ర జపము గావింపు చున్న సాధకునికి ఆజన్మాంతము అదృశ్యసిద్ధి కలిగి సుఖపందల నందగలడు.

## సులోచనా యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం క్లైం సులోచనాద్వి దేవీ స్వాహా ॥**

జన సంచారము లేనటువంటినదీ తీరప్రాంతంలో నది ఒడ్డున ఒంటరిగా 40 దినములు దినమునకు 5000 వంతున జపించవలెను. ఏ దినము కాదినము నదియందలి నీటిని ఒక కడవనిండా కొనిదెచ్చి వసుపు, కుంకుమ, పూలు, అక్షతలు, అగరు, చందనాదులతో అఘటమును పూజించి, ధూపమిచ్చి, మద్యమాంసములు నివేదించి నమస్కరించి జపం కొన సాగించాలి.

సాధకుని, ఓర్పును ప్రతిక్షణము దేవత పరీక్షింపు చుండును. స్థిర చిత్తముగల్గి, కడునిగ్రహంతో సాధనకంత రాయంలేకుండా నలుబది

దినములు జపంపూర్తిగావించి నలుబది ఒకటవనాడు రాత్రి సమయంలో హోమగుండము నేర్పాటు గావించి దానికి తూర్పు ఈశాన్య (ఆగ్నేయ) భాగాలలో ఒక అలంకరించిన నల్లమేకను కట్టివైచి, ఉత్తర ముఖంగా కూర్చుని, ఆవునెయ్యి, మేడిప్రమిదలు, క్షీరాన్నములతో 20,000 పర్యాయములు, హోమము గావింపవలెను.

హోమము ప్రారంభించినది మొదలు ప్రకృతి తీవ్ర భయంకరంగా మారిపోగలదు. ఆకాశంలో పెద్ద పెద్ద ఆరుపులు, కేకలు, ఏడుపులు, వికటాట్టహాసాలు ధ్వనించి సాధకుని మానసిక స్థైర్యమును పోగొట్టుటకు ప్రయత్నించును. ఈ విపరీతములకు చలింపక ధైర్యంతో హోమకార్యక్రమం నిర్వహించాలి. ఒక్కొక్క సమయంలో తానుకట్టివేసిన మేక కృరమృగంగా మారి తనపై దుముకుచున్నట్లుంటుంది. అయినా చలింపకూడదు. హోమం పరిసమాప్తినందే సమయానికి వాతావరణం ప్రశాంతంగా మారుతుంది. హోమజ్వాలలు వివిధ రంగులలో కనుపించును. సాధకునికి అభిముఖంగా సులోచనాయక్షిణీ దర్శనమిస్తుంది. వెంటనే సాధకుడా దేవతకు సాష్టాంగ మస్కార మొనర్చి "హేజగ త్కళ్యాణి యక్షిణీ ప్రసన్నంకురుకురు" అని ప్రార్థించాలి. అప్పుడా దేవత సాధకునికి తన అభయహస్తాన్ని చూపుతుంది. వెంటనే సాధకుడు కట్టివుంచిన మేకను విప్పి దేవికి కానుకగా సమర్పింప వలెను. సాధకుని భక్తికి సంతుష్టినందిన యక్షిణి రెండు పాదుకులకు సాధకుని కొసంగి అంతర్ధానం జెందుతుంది. ఈ పాదుకలు ధరించిన సాధకుడు వాయుమార్గం గుండా మనోవేగంతో ఎక్కడికైనా క్షణకాలంలో పయనింప గలడు. ఈ సాధనయందు గూడా పాదుకలను ఇతరులు తాకుట పనికిరాదు.

# సురసుందరి యక్షిణీ మంత్రం

**మంత్రం :**

ఓం హ్రీం ఆగచ్ఛ ఆగచ్ఛ సురసుందరీ స్వాహా ॥

సాధకుడు నిర్జన ప్రదేశములందుగల పాడుబడిన శివాలయంలో ఈ సాధన ప్రారంభించాలి. అతి స్వల్పమైన పాల అన్నము ఒక్క పూట భుజించుచూ మౌన ప్రధాన్యంగా జితేంద్రియుడై మూడు సంధ్యలయందు మరియు నిశీధిసమయమందు తడవకు 1008 వంతున 40 దినములు నిష్టగా శివలింగమున కెదురుగా కూర్చుని జపంచెయ్యాలి. ప్రతి సంధ్య యందు జపంపూర్తి అయినతోడనే ఆ శివలింగమును పూజించి నమస్కరిస్తుండాలి.

ముప్పది ఏడు దినములు గడుచు వరకు సాధన నిర్విఘ్నంగానే కొనసాగుతుంది. చివరి మూడు రోజుల్లో ఊహాతీతమైన పరిస్థితులు సంభవించి దీక్షా విఘ్నం సంభవించే ప్రమాదము గలదు. నలుబదివ రోజు రాత్రిపూట శివలింగమున కెదురుగా హోమకుండము నేర్పాటు గావించి, ఆవుపాలు, చెరుకు రసము, మధురమైన ఫలాలు, సుగంధ ద్రవ్యాలు, పూల మాలలు సమకూర్చుకొని, మారేడు పళ్ళగుజ్జు, పెరుగు పేలాలు కలిపి 16 వేల పర్యాయములు మంత్రోచ్ఛారణ మొనర్చుచు హోమం చెయ్యాలి. ఆ పాడుబడిన శివాలయం పాతాళంలోకి దిగిపోతున్నట్లు విరిగిపడి పోతున్నట్లు, తనకంతకు పూర్వము పరిచయముండి తాను వాంఛించిన స్త్రీలు వివస్త్రలై తనను సమీపించుతున్నట్లు తన భార్యా పిల్లలు లేక తనకు ప్రాణాధికమైనవారు

ఆర్తనాదం గావింపుచున్నట్లు, తనకు కనుపించి భావోద్రేకము అధికమై, నిగ్రహత్వం కోల్పోనగల మరెన్నో విధములైన పరీక్షలు కలుగును. వీటన్నిటికీ తట్టుకొని మనస్సును చంలింపనీక కార్యక్రమం పూర్తి గావించిన తోడనే, మంగళవాద్య ఘోషలు – ఘంటాశంఖ నినాదములు కల్గి ఆ ఆలయం బహుప్రకాశవంతమౌతుంది. శివలింగమున వెనుక భాగంలో యక్షిణీ దేవత అపురూప సౌందర్యంతో ప్రత్యక్షము కాగలదు.

సాధకుడు దేవతా సౌందర్యమునకు దిగ్భ్రాంతినంది మనసు చలింప కుండా (ఏవిధమైన దుష్టతలంపు లేకుండా) మాతృభావంతో ఆ దేవతకు ప్రదక్షిణ నమస్కారములు గావించి అర్ఘ్యమిచ్చి తానుసమకూర్చి వుంచిన పాలు మొదలగు ద్రవ్యములా దేవీకొసంగిన ఆమె వాటిస్వీకరించి, సంతుష్టనంది, సాధకుని జూచి సుందర మందస్మితదరహాసచంద్రికలొాల యింపుచూ "తృప్తాస్మినరోయంతృప్తోస్మి, కిమీప్సితంవద" అని పలుకును. సాధకుడప్పుడా యక్షిణీని ఏదికోరాలో తెలియని అవ్యక్తానుభూతులలో మునిగిపోయివుంటాడు. ఇది జీవితంలో ఒక దివ్యానుభూతి. దానికితోడు యక్షిణీ సౌందర్య మాయాప్రలోభం ఎక్కువగా వుంటుంది. అయినా సాధకుడు తన శ్రమ ఫలించే ఆఖరి క్షణంకోసం జితేంద్రియుడై కాచుకొని వుండి, దేవితనకు కోరిక చెప్పమనినతోడనే, "ఇంద్రసమాన ఐశ్వర్యభోగాని దేహిదేహి" అని పలకాలి. దేవత "తథాస్తు" అంటూ సాధకుని ఆశీర్వదించి అదృశ్యమౌతుంది.

అటు పిమ్మట సాధకుడాదేవి పరిత్యజించిన భుక్తశేషమును స్వీకరింపగా, యక్షిణీ సిద్ధికల్గి, శరీరం దివ్యత్వము నందినూతనమైన బలము వర్చుస్సు, సంతోషము గలవాడగును. అది మొదలు ప్రతి దినము

రాత్రి వేళలందు సాధకుడు ఒంటిరిగా ఏకాంతంగా శయనిస్తుండాలి. అర్ధరాత్రి సమయంలో అందెలసవ్వడులతో అపురూప సౌందర్య రాశులైన అప్సరస స్త్రీలు దినమున కొకరివంతున సాధకుని మందిరమునకు వచ్చి, సాధకునితో భోగించి, సురతిక్రీడలు నెరపి, దివ్యా భరణములు, వస్త్రములు, బంగారు నాణెములు, వజ్రవైడూర్యాది రత్న సంపదలు ప్రతినిత్యము సాధకుని కొసంగి పోవుచుండెదరు.

సురసుందరీ యక్షిణీ విశేషమహిమ గలది. ఈ మంత్ర సిద్ధి చేరుకూట బహుదుర్లభము, ఈ విద్య ఏ సాధకునికి సిద్ధించునో అతడు ధన్యుడు. సురకాంతల సహచర్యముచే అతనికి అమరత్వం లభించి, జరా, (ముసలితనము) రోగ రహితుడై తనకు రాశిపెట్టిన ఆయుః ప్రమాణము కంటె నాల్గు రెట్లు ఆయుర్దాయము గలవాడై, నిత్యనూత నోల్లాసముతో సమస్త సంపదలు, భోగములు, గౌరవాది, కారములు గలవాడై సుఖింపగలడు.

మంత్రసిద్ధినందిన సాధకుడు తన జీవితంలో ఎట్టి పరిస్థితులలోను ఏ మానవ స్త్రీయందు కామవాంఛ కలిగి యుండ కూడదు. పొరపాటున మనుష్య కాంతాసంగమం గావించిన సాధకుడు దేవకాంతల ఆగ్రహానికి గురియై వారిచే శపింపబడి, నిర్భాగ్యమైన దుర్భరజీవితం గడపవలసి వుంటుంది.

మానవ సహజమైన ఆత్యాశతో ఈ విద్యను సాధింపదలచి కృషి యొనర్చినవారనేకులు, సంఘంలో పిచ్చివారిగా పరిగణింప బడు తున్నారు. వారికి అన్నీ తెలుసు. ఇంద్రియ నిగ్రహం కోల్పోవటం వలన వారి జీవితాలు విషాదభరితములైనవి. వీరిలో బాగా తెలివిగలవారు, విద్యావేత్తలు, సన్యాసులు, ఉపాసకులు గూడా వున్నారు.

# శ్మశాన యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం క్రీం క్రీం భగవతీభ్యో నమః ॥**

ఈ మంత్ర సాధనకు అమితమైన ధైర్య సాహసములవసరము. ఒక నిర్జన ప్రదేశమునందున్న రావిచెట్టువద్ద ఏకాంతంగా రాత్రి సమయములందు దినమునకు ఐదువేలవంతున 40 దినములు స్థిరచిత్తముతో పై మంత్రమును లక్ష జపించిన తర్వాత, పేలాలు, కుడుములు, మద్యమాంసములు తీసికొని ఒంటరిగా ఆదివారం రాత్రిపూట శ్మశానమునకు వెళ్ళి అక్కడ అంతకు పూర్వం శవమును కాల్చిన ప్రదేశమందు యక్షిణీ దేవత చిత్రమును లిఖించి, పసుపు కుంకుమ పూలు ఆచిత్రముపై పూజించి చిత్రమునకు రెండు గజములు యెడముగా చూట్టూగడిగీచి అగడిలోపల, చిత్రమున కెదురుగా దక్షిణ ముఖంగా తానుకూర్చుండి, గడిపై ఎనిమిది దిక్కులందుకుడుములుబెట్టి, గడికి వెలుపల చుట్టూ పేలాలు చల్లవలెను.

చిత్రమునకు తనకు మధ్యన దీపారాధన చేసి యక్షిణీ దేవతను ధ్యానించి మంత్రజపం చేయుచుండవలెను. ఈ జప సమయంలో తన దృష్టిని చిత్రమునందుంచి మనస్సును చంచలపరుపక ఏకాగ్రస్థితికల్గి జప మొనర్చు చుండవలెను. సాధకుని మనోస్థైర్యమును పరీక్షించుటకు యక్షిణి వివిధ రూపాలతో భయోత్పాదక మొనర్చి అట్టహాసం గావిస్తుంది. అయినా సాధకుడు చలింపకుండా ఐదువేల జపంపూర్తి గావించిన

యెడల తాను వ్రాసిన చిత్రం కదులుతుంది. అప్పుడు సాధకుడా చిత్రమునకు ప్రదక్షిణ నమస్కారములు గావించి తాను తెచ్చిన మద్య మాంసములను సమర్పించిన యక్షిణి సంతుష్టినంది "సాధకా! కింవాంఛితం' అని పలుకుతుంది. ఈ మాటలు సాధకునికి మాత్రమే వినిపించగలవు. అప్పుడు సాధకుడు అంజలి ఘటించి "భోమాత! ఆగత అనాగత భూత భవిష్యత్ వర్తమాన విషయ పరిగ్రహ్యాసిద్ధిం దేహి దేహి అనిపలకగా సాధకుని దోసలియం దొక అస్తిక (ఎముక) వుండగలదు. ఆ ఎముక లభించుట వలన సాధనకునికి మంత్రసిద్ధి చేకూరగలదు.

యక్షిణి ఇచ్చిన ఎముక సాధకుని వద్దవున్నంత కాలము ఈ జగత్తునందు జరుగుతున్న, జరుగబోవుచున్న, జరిగిన అన్ని విషయములను సాధకుడు గ్రహింపగలశక్తి గలవాడగును. సాధకుడే విషయము గురించి యక్షిణిని తలంచినను ఆ విషయమును గురించి ఆక్షణమందే సత్యమైన వార్తలను యక్షిణి సాధకునికి తెలుపుచుండగలదు. అయితే సాధకుని వద్దగల ఎముకను కొనిపోవుటకా యక్షిణీ అనుక్షణము ప్రయత్నింపుచునే యండకలదు. సాధకుడా ఆస్తికను కడు భద్రముగా ఎల్లవేళలందు. శరీరముపై ధరించియుండిన ప్రమాదముండదు. విడిగా నెచ్చటనూ పెట్టగూడదు.

# శతపత్ర యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రాం శతపత్రికే హ్రీం హ్రీం శ్రీం క్లీం స్వాహా ॥**

వెయ్యి చామంతి మొక్కలు మాత్రమే గల తోట యందు ఏకాంతంగా రాత్రి సమయాలలో ఈ మంత్ర జపం చేయ్యాలి. తామర పూవులు గల కొలను యందు కంఠం లోతున నిలబడి గూడా జంప చెయ్యవచ్చును. ఈ ప్రకారం జితేంద్రియుడై దినమునకు 2500 వంతున 40 దినములు జపించి లక్ష సంఖ్య పూర్తిగా గావించాలి.

అటు పిమ్మట నూరుగురు కన్యలకు సంతుష్టిగా భోజనము పెట్టి, ఆ రోజురాత్రికి తోటయందు హోమకుండముల నేర్పరచి ఉత్తరాభిముఖుడై కూర్చొనీ, ఆవునెయ్యి యందు చామంతి లేక తామరపువ్వులను ముంచి 10,000 పర్యాయములు పై మంత్రముచే హోమము గావించిన యెడల సిద్ధి చేకూరగలదు.

ప్రతి దినము ఆహోమ భస్మము కలిపిన నీటితో స్నానము గావింపుచూ ఆ భస్మమునే తిలకముగా ధరింపుచున్న ఆనతి కాలము నందే సాధకుడు అత్యద్భుతముగా గొప్ప పదవి నందగలడు. రాజుగానీ, రాజసమానమైన పదవిగానీ లభించి, సకల సుఖములు, ధనధన్యవస్తు వాహనములు గలవాడై ఆజన్మము దేవేంద్ర సమానమైన ఐశ్వర్యము గల్గి సుఖింపు చుండగలరు.

# సులక్షణా యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రీం ప్రమోదాయ స్వాహా ॥**

రాత్రివేళలందు మొదటి రెండు జాములు నిద్రించి లేచి ఏకాంతముగా మంచముపైనే కూర్చుండి. దినమునకు మూడు వేల ఐదువందల వంతున 30 దినములీ మంత్రమును జపించవలెను. 31వ రోజు నిద్రలేవకుండా (మెలకు వచ్చినను లేవగూడదు) వుంటేసులక్షణా యక్షిణి వచ్చి సాధకుని నిద్ర లేపును. అప్పుడు సాధుకుడు దేవికి నమస్కరించి, అర్ఘ్య పాద్యము లొసంగి, ఫలక్షీరములు సమర్పింపగా ఆ దేవత స్వీకరించి సంతుష్టినంది, పాతాళలోకమునందుగల నిధిని సాధకునికిచ్చి అదృశ్యము కాగలదు.

అది మొదలు ప్రతి నెల యందు అదే రోజున పూర్వము విధముగానే యక్షిణి వచ్చి నిద్రలేపుచుంటుంది. సాధకుడొసంగిన అర్ఘ్యాదులు ఫలక్షీరములు స్వీకరించి ఒక నిధిని సాధకుని కొసంగి పోవుచుండుట వలన సాధకుడిలోక మందెన లేని అఖండైశ్వర్యవంతుడై సుఖములను పొందగలడు. యక్షిణీ ప్రసాదించిన ద్రవ్యంలో సగభాగము ధార్మిక, దైవకార్య క్రమములకు వినియోగించుట మంచిది.

# మాహేంద్రి యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం మాహేం ద్రీయలుకురు హం సః స్వాహా ॥**

జ్యోతిశ్శాస్త్రరీత్యా ఇంద్రధనస్సు ఏర్పడు కాలమును తెలుసుకొని, ఆ సమయంలో వావిలిచెట్టు క్రింది కూర్చుని ఈ జపం ప్రారంభించాలి. వ్రత దీక్షానియమములు కల్గి, మితాహారియై, ప్రతి దినము నిశీధిసమయంలో దినమునకు 2500 వంతున 40 దినములు జపములు చేసిన యక్షిణీ తృప్తినంద గలదు.

గురువారం నిశీధివేళలో వావిలిచెట్టు క్రింద కుండము నేర్పరచి తూర్పు ముఖముగా కూర్చుని స్థిరచిత్తుడై బాలింత పాలచేవండిన పాయసమునందు మేక నెయ్యి గలిపి పదివేల పర్యాయములు హోమము గావింపవలెను. హోమసమయంలో స్త్రీ పరమైన లేక ఇతరములైన యెట్టి చిత్త విభ్రమములు కల్గినను నిగ్రహించి హోమముపూర్తిగావించిన వావిలిచెట్టు దానంతట అదికదిలి ఇంద్రధనస్సు వలె ఒక మారు మెరియగలదు. ఆ వెంటనే సాధకుడా చెట్టునకు ప్రదక్షిణ నమస్కారము లొనరించి, పూజింపగా యక్షిణి అనుగ్రహింపగలదు. దీనికి గుర్తుగా చెట్టు యొక్క కొమ్మలందు దేవతవదలి వేసిన చీనాంబర మొకటి (పట్టు వస్త్రం) దొరకును. సాధకుడు వస్త్రమును భద్రపరచి నిత్యము తానుధరింపుచున్న యడల ప్రతిదినము ఒక పాతాళకన్య సాధకుని పొందు కొరకై వచ్చి విచిత్రభక్ష్య భోజ్యములుకుడవబెట్టి సుఖింపజేసి, అనేక విధములైన మణులు, రత్నభూషణములు, బంగారము నొసంగిపోవు చుండగలదు. (సాధకుడది మొదలు అన్య స్త్రీ వ్యామోహమును వదలవలెను.)

# చంద్రికా యక్షిణీ మంత్రం

**మంత్రం :**

ఓం హ్రీం వంవం చంద్రికే హంసః స్వాహా ॥

ఏ నెలయందైనగానీ శుక్లపక్ష పాడ్యమి రోజున ఈ మంత్రమును జపించుటకు ప్రారంభించి, పూర్ణిమ వరకు ప్రతి దినము చంద్రుని కెదురుగా కూర్చుని జపం చేస్తుండాలి. జపం అయిన వెంటనే అంతకు ముందుగా ఏర్పాటు గావించు కొనివుంచిన వెండి కలశమును యధాశక్తిగా పూజించి, చంద్రునికి అర్ఘ్య పాద్యములొసంగుచుండవలెను.

ఈ జపం చంద్రకళల ననుసరించి ఏకోత్తరవృద్ధి క్రమంలో చెయ్యాలి. అనగా పాడ్యమినాడు వెయ్యి, విదియనాడు, రెండు వేలు, తదియ రోజు మూడు వేలు, ఈ ప్రకారం చెయ్యగా చతుర్ధశీనాటికి ఒక లక్షా ఐదువేల జపంపూర్తి కాగలదు. సాధకుడు ఆవుపాలు మాత్రమే ఆహారంగా సేవించి మౌనవ్రతం కలిగివుండాలి.

పున్నమి రోజు జపం ప్రారంభించినప్పటి నుండి అనేక విఘ్నాలు కలుగును. ఆకాశం మేఘావృతం కావచ్చు. లేక కుంభవృష్టి కురియ వచ్చు. పిడుగులు రాలవచ్చు. అయినా సాధకుడు జపం అపకుండా చేస్తూవుంటే నిశీధిదాటిన తర్వాత యక్షిణీ ప్రత్యక్షమై కాగలదు. సాధకుడామెకు ప్రదక్షిణ నమస్కారములొనర్చి అర్ఘ్యపాద్యము లొసంగిన దేవత సంతుష్టినంది చిరునగవులతో లయించి సాధకుని వద్దగల వెండి కలశమును తీసుకొని అభిమంత్రించి ఇచ్చి అదృశ్యమగును. యక్షిణి ఇచ్చిన కలశంలో దివ్యరసాయనం (ద్రవ పదార్థం) వుంటుంది.

ఈ విధంగా మంత్రసిద్ధినందిన సాధకుడా రసాయనమును సేవించుట వలన (కొంతభాగం) ముసలితనం ఆకలి, దప్పిక, బడలికలు లేక నిత్య నూతన యౌవ్వనము గలిగిన వాడై చిరకాలము జీవింపగల్గును. ఆ రసాయనమును ఏవ్యాధి గ్రస్థునకిచ్చినను, అతడు స్వస్థుడై సంపూర్ణారోగ్య బలతేజస్సులు కల్గి యుండగలడు. ప్రపంచంలో దేనివలనను సాధింప (కుదరని) బడని వ్యాధులీరసాయన స్పర్శవలన నివారింపబడును. ఇది అమృత తుల్యమైన రసాయనము.

## పద్మావతీ యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రీం క్లీం అష్టసిద్ధేశ్వరి పద్మావతీ స్వాహా ॥**

సాధకుడు తనకేవిధమైన ఆటంకములు కలుగని విధముగా నొక ప్రత్యేక గృహముమందుగానీ, పర్వాతాగ్రము నందుగానీ వ్రతదీక్షాపరుడై సాధనకుపక్రమించాలి. ఉప్పు, కారములు లేని పెసరపప్పు బియ్యము కలిపి వండిన అన్నము నందు నెయ్యి మాత్రము కలిపి కొలదిగా ఒక పూట మాత్రమే భుజింపుచూ పాలు, ఫలములను ఉపాహారముగాగొని మౌనవ్రతుడై దినమునకు పదివేలవంతున పన్నెండు లక్షల జపమగు వరకు (120 దినములు) జపించాలి.

ప్రతిదినము జపప్రారంభమునందు, చివరి యందు యక్షిణీదేవతను ధ్యానించి, పూజ యొనర్చి, సుగంధ ద్రవ్యాలతో అర్ఘ్య మివ్వాలి. గురువు తప్ప మరెవ్వరు సాధకున వద్దకు రాకూడదు. బైట

ప్రపంచ విషయాలేవియు సాధకునికి తెలియకూడదు. ఈ ప్రకారం జపదీక్ష పూర్తి గావించి, హోమ కుండమునందు శాస్త్రోక్త ప్రకారముగా అన్ని ప్రతిష్ఠాపనముగావించి, తూర్పు ముఖముగా కూర్చుని, గురుదేవతా మంత్రములకు సామీప్యస్థితిని కలిగింపుచూ (ఇదియోగాభ్యాసపరులకే సాధ్యము) ఆవునెయ్యి, హవిస్సు, ఎండు ఖర్జూరములు కలిపి ఒక లక్షా ఇరుపది ఐదువేలు పై మంత్రముచే హోమము గావించి, పూర్ణాహుతినిచ్చిన ఆహోమకుండము నందు యక్షిణీ దేవత సాక్షాత్కరింపగలదు. సాధకుడా దేవకి భక్తిగా ప్రదక్షిణ నమస్కారము లొనరించి అర్ఘ్యపాద్యమ లిచ్చి, స్తుతింపగా, ఆజనని పరమానందము నంది సాధకుని కొక మణిని (గుళిక) యిచ్చిపోవును.

ఈ మణి ప్రభావము వలన సాధకుడజేయుడై యుండి అష్టసిద్ధులు కలవాడగును. త్రిమూర్తితుల్య ప్రకాశమానుడై వెలుగొందుచుండగలడు. అష్టసిద్ధులనగా అత్యద్భుత శక్తులు గలవి.

## అష్టసిద్ధులు - వాటి ఫలితాలు.

1. **అణిమాసిద్ధి** : పరమాణువున కన్నను సూక్ష్మమైన శరీరమును బొందుట.
2. **మహిమాసిద్ధి** : ఏది సృష్టియందు గొప్పదోదానికన్నా గొప్పగా నుండుట.
3. **గరిమాసిద్ధి** : విశ్వమందేది ఎక్కువబరువో దాని కన్ననూ బరువుగా నుండుట.
4. **లఘిమాసిద్ధి** : అతి తేలికగలదానికంటే తేలికయగుట.

**5. ప్రాప్తిసిద్ధి** : సూర్యచంద్రాదుల పైనా శ్రమలేక సునాయాన ముగా తాకునట్టి శక్తి గలుగుట.

**6. ప్రాకామ్యసిద్ధి** : తానుఏదితలచిన అది జరుగుచుండుట.

**7. ఈశత్వసిద్ధి** : దేవతామహిమలు కల్గియుండుట.

**8. వశిత్వసిద్ధి** : సకలచరాచర ప్రపంచమునందలి జీవరాశులు. ప్రకృతి తన ఆజ్ఞకులోబడి యుండుట.

## ఓషధీ యక్షిణీ మంత్రం

**మంత్రం :**

ఓం హ్రీం సర్వ సర్వతే శ్రీం క్లీం సర్వోషధీ ప్రాణదా
యినీ వైర్రుత్యై నమో నమః స్వాహా ॥

**వేరొక విధము మంత్రం :**

ఓం హ్రీం శ్రీం క్లీం సర్వోషధీ ప్రాణనిలయే సర్వసత్వే క్లీం
హ్రీం శ్రీం నైర్రుత్యై నమః స్వాహా ॥

ఈ రెండు మంత్రములందేదైనను నియమము గల్గి లక్ష జపించుట వలన సిద్ధినందగలదు. అటు పిమ్మట చతుర్ధశీ యందుపవాసము గావించి. పూర్ణిమనాడు ఉదయం శివపూజ యొనర్చి రాత్రి నిశీధికాలము వరకు శివాలయంలో శివుని కెదురుగా కూర్చుని జపించిన "నైర్రుతి" అను యక్షిణీ ప్రత్యక్షమగును. ఆమె చాలా భీకరాకారము కల్గి యుండుట

వలన సాధకుడు భయము నందక లేచి చేతులనొగ్గి నమస్కరించి ఒక నల్ల మేకను ఆమెకు సమర్పించిన ఆమె సంతసించి. సాధకునికొక రసాయనమునొసంగి అంతర్ధానము జెందును.

ఈ ప్రకారముగా మంత్రసిద్ధిబడసిన సాధకుడు ఆరసాయనమును ఏ ఓషధిపై చిలకరించిన ఆ ఓషధి దివ్య మహిమాసమన్వితమై భాసింపు చుండును. దానికి సకల జీవ కళలు తక్షణమందే చేకూరగలవు. రసవిద్యల కొరకు నిర్ణయింపబడిన ఓషధులపై రసాయనమును చిలకరించి ఆఓషధిని ఉపయోగవించుటవలన రిససిద్ధి కల్గి అత్యంతాశ్చర్యకరముగా రసవాదమందు ఇనుము గూడా బంగారముగా మారగలదు.

## అనల యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం హ్రీం రంరం అగ్నిముఖే ఆదినిలయే అం అం స్వాహా ॥**

ఇది యక్షిణీ మంత్రములలో నొక మహత్తరశక్తిగల మంత్రము దీని సాధనగూడా బహు కష్టముగా నుండగలదు. ఈ సాధనకు పక్రమించుటకు ముందుగా సాధకుడు జాతిగల నల్లకుక్క (మగది) నొకదానిని బాగా మచ్చిక చేసుకొని వుండాలి. ఆ కుక్కకు శరీరంలో ఏ భాగంలో గూడా వేరే రంగు గల నెంట్రుక యుండగూడదు. శరీరం మొత్తం పూర్తిగా నల్లగా వుంటేనే అదిసాధనకు యోగ్యమగును.

సాధకుడమావాస్యనాడు ఈసాధనకు పక్రమించాలి. మానవరక్త ముతో తడిపిన అన్నమునొక పాత్రయందుంచుకొని కుక్కతో సహా అర్ధరాత్రి వేళ శ్మశానంజేరి, ఆ శ్మశానం మధ్యలో మేకుపాతి బలమైన త్రాటితో కుక్కకు కట్టివేసి దాని మూతికి (అందీ) అందకుండా ఈ రక్తాన్నముగల పాత్ర నుంచి జపం ప్రారంభించాలి.

ఆ అన్నంకొరకు కుక్క గింజుకులాండుతుంటుంది. దానికి మాత్రం పాత్ర అందకూడదు. ఈ ప్రకారం అమావాస్య మొదలుకొని తిరిగివచ్చెడు. అమావాస్యకు మందు చతుర్ధశి వరకు దినమునకు 7 వేల వంతున పై మంత్రమును జపింపుచుండవలెను. జపము ముగిసిన తోడనే ఆ రక్తాన్నమును ప్రతి దినము జలములందు కలిపిరావలెను. జపం జరిగే దినాలు పెరుగుతున్నకొలది, జపసమయంలో కుక్కచేసే ఆర్భాటాలు, హంగామాలు అధికంగా ఉండును. ఒక్కొక్క సమయంలో అ కుక్క అతిభీకరంగా కోరలు తెరచి సాధకుని పీక్కుతినాలనే విధంగా మీదకు రావటానికి ప్రయత్నిస్తుంది. సాధకుడెప్పుడూ ఆ కుక్కకు అందని విధంగా సమీపంలోనే కూర్చుని జపం చెయ్యాలి. ఆ సమయంలో అవలయక్షిణీ ఆ కుక్కలో ప్రవేశించుటవలన దానిరూపం మహాభయ కరంగా వుంటుంది. ఇట్టి భయంకర వాతావరణవలన కలతజెందక తదేక దీక్షతో సాధకుడు నిత్యము రాత్రివేళలందు తనజపాన్ని కొనసాగిస్తుండాలి.

తిరిగి అమావాస్య వచ్చిన దినమే మంత్రసిద్ధి కలిగే రోజు. ఆ రోజు సాధకుడు బహుజాగ్రత్త వహించి, రక్తాన్నముతో బాటుగా చేపలు, మేకమాసంము, కల్లు కూడా అక్కడ బెట్టి జపం ప్రారంభించాలి. ఆ సమయంలో కట్టివేయుబడిన కుక్క మామూలు కుక్కగా గాక అనేక

భీకర మృగరూపాల్లో కనుపించి – గర్జించి అనేక విధాలుగా సాధకుడిని భ్రమింపజేసి ఓర్పు సహనం కోల్పోయే విధంగా ప్రవర్తిస్తుంది. శ్మశానమంతా విచిత్ర శబ్దాలతో మారుమ్రోగిపోగలదు. అయినా సాధకుడు మాత్రం ఏమాత్రం చలించకుండా ఏకాగ్రతతో కదలకుండా కూర్చుని మంత్రజపం చేస్తూనే వుండాలి. నిశీధివేళదాటిన తర్వాత కుక్క మామూలూలుగానే రొప్పుతూ సాధకుని వంక జాలిగాచూస్తుంది. దానికనులు వెంట నీరు కారటం గమనించాలి. అప్పుడు సాధకుడు లేచి ముందుగా చేపలను కుక్కనోటి కందించాలల. అవితిని గూడా అన్నం వంకే చూస్తుంది. ఆ తర్వాత మాంసం, అది తిన్న తర్వాత కల్లుకుండ ముందుంచాలి. ఆకల్లు తాగిన తర్వాత గూడా అన్నంకోసం ఆరాటంపడుతుందాకుక్క, అప్పుడు సాధకుడు అన్నము గల పాత్రతీసుకొని మంత్రజపం చేస్తూ పారవేయుటకొరకు నీటి వద్దకు వెళ్ళాలి. సాధకుడా అన్నం నీటిలో వేస్తాడు అనే సమయంలో కుక్కలో వున్న యక్షిణీ మాట్లాడుతుంది. ఆమె సంభాషణ సాధకుని యొక్క మాతృభాషలోనే వుంటుంది. “మానవా! అగు. ఆ ఆహారం పారవేయకు. యిటు తెమ్ము! నీ అభీష్టం నేను నెరవేర్చగలను. ఆ ఆహారం నాకిమ్ము! వేగమే యటురమ్ము!” అని బ్రతిమిలాడు ధోరణిలో ఆమె భాషిస్తుంది.

అప్పుడు సాధకుడా అన్నముగల పాత్రను గొనివచ్చి యక్షిణితో “ఓ అనలా నీ వీ కుక్కయందే నిరంతరము అధివశించియుండి యెల్లవేళయందు నన్ను వదలక ఈ ఐహిక ప్రపంచంలో నేను కోరిన సమస్త కోర్కెలు నెరవేర్చు చుండవలెను! ఇదినీకు సమ్మతమేనా?” అని అడుగవలెను. అప్పుడా కుక్క తలనుతోకను ఆడింపుచూ సాధు స్వభావంతో తన అంగీకారం తెలుపుతుంది. అప్పుడా సాధకుడా అన్నము నా కుక్కకు పెట్టిన అది తృప్తిగా భుజించి సాధకునికి లొంగి పోగలదు.

ఈ విధంగా మంత్రసిద్ధినందిన సాధకుడు శునకరూపంలో తనను వదలకుండా వెంటనంటివుండే ఆ అనల యక్షిణీ ద్వారా తమ కోరిన ప్రతి కోరికను క్షణములలో సాధింప వచ్చును. ఆ యక్షిణీ అన్ని వేళలందు సాధకుని, అతని కుటుంబమును రక్షింపుచూ నుండగలదు. ఆ కుక్క ఎక్కడ చొంగకార్చిన అక్కడ ప్రచండమైన దావానలము పుడుతుంది. అది తీక్షణముగా దేనినైతే చూచునో అది తక్షణమే దహింపబడగలదు. ఆ శునకము అరచిన యెడల భూమి కపింపగలదు. దానికి సాధ్యముగాని పని ఈ విశ్వంలోలేదు. సాధకుడు మాత్రం ప్రతిదినము నిశీధి సమయంలో మానవరక్త మిశ్రితమైన అన్నమా కుక్కకు పెట్టుట మరువ కూడదు. ఏ దినము ఆహారము లేకుండునో ఆదినమాశునకమునందున్న యక్షిణీ సాధకుని సపరివారంగా నిర్మూలించి, రక్తమాంసాదులారగించి వెళ్ళి పోగలదు.

ఈ అనల యక్షిణీ సాధన  చాలా కష్టతరమైయున్నది. ప్రారంభం లగాయితు సాధకునికి మృత్యువుతో పోరాటంగానే వుంటుంది. ఒకవేళ సిద్ధించినా దిన దినగండం ఎదురు చూస్తుంటుంది. అందువలన ఈ యక్షిణీ విద్య మంత్రశాస్త్రములందలి రహస్యముగా నుంచబడినది. దీని మూలమంత్ర స్వరూపం యిక్కడ స్థూలంగా చెప్పబడినప్పటికీ దాని కనుసంధింపవలసిన పల్లవములు (వాక్యములు) గలవు. కుక్కయొక్క జాలిలక్షణములు గూడా శాస్త్రము నందు విపులముగా గలవు. అనుభముగల్గిన గురువుద్వారా ఆ విషయములన్నియు సమగ్రముగా తెలుసుకోనిదే ఈ సాధన సిద్ధింపదు మూర్ఖముగా, అన్నీ తెలుసుననే ధీమాతో చేయుట వలన మృత్యువు కల్గుటయే నిశ్చయము.

# విశాలనేత్రి యక్షిణీ మంత్రం

**మంత్రం :**

**ఓం ఐం హ్రీం జ్ఞానేత్రీ విశాలే స్వాహా ॥**

వ్రతదీక్ష నియమములు గలిగి నిర్జనమైన ప్రదేశ మందలి తెల్లఅంకోల (ఊడుగ) వృక్షము క్రింద ఉత్తరాభిముఖుడై కూర్చుని రాత్రి మూడవయామం ప్రారంభంనుంచి ఉదయం వరకు భక్తి శ్రద్ధలతో జపించాలి. ఈ ప్రకారం 40 దినములు జపించుటవలన మంత్రసిద్ధి చేకూరగలదు. అటు పిమ్మట దశమీ సోమవారం గల దినము అర్ధరాత్రి దాటిన పిమ్మట తాను పూర్వం జపింగావించిన అంకోలవృక్షము వద్దకు వెళ్ళి ఆ చెట్టును పూజించి, ప్రదక్షిణ - నమస్కారములు గావించి, దిగంబరుడై ఉత్తరదిశగా పారిన ఆ చెట్టు యొక్క వేరును ఖండించి తీసుకురావాలి.

ఊడుగవేరును నీడలోయెండించి దానిపై బెరడువలచి మెత్తగా దంచి దానియందు కర్పూరము, తేనేవేసి కాటుక లాగునజేసి ప్రతిదినము ఈ కాటుకను రెండుకనులుకు పెట్టుకొని పరుండవలెను. ఈ ప్రకారము 40 దినములు చేసిన సాధకుడు తన కళ్ళకు గంతవగైరాలు కట్టినప్పటికీ తన యెదురుగా నున్న అన్నిదృశ్యములు చూడగలడు. కనులు మూతపడినను జ్ఞానేత్రము ద్వారా సమస్త విషయములను చూడగలడు.

